# స్నేహలతా దేవి

రాయప్రోలు
సుబ్బారావు

△




నవ్య సాహిత్య పరిషత్తు
△ గుంటూరు △

" Oh woman; lovely woman; nature made thee
To temper men; we had been brutes without you;
Angels are painted fair, to look like you;
There is in you all that we believe of heaven,
Amazing brightness, purity and truth,
Eternal joy and everlasting love".

OTTWAY

మృదుహృదయుఁడైన వాల్మీకి మొదలుగాఁగ
నెంద ఱెందఱు సుతులనో యెత్తి పెంచి
మమత తీఱని యేఃకకుమారసరణి
నను గటాక్షించు తల్లి వాణిని నుతింతు.

బొంది నశియించియును వహ్నిపూత మయిన
బూదిలోన ఛాయావాసనాదికముగ
రాగరసములు నిల్చు నట్ల బ్రణయవిదుల
స్నేహమీమాంసలను స్మరించెదను మదిని.

ఆర్యకన్యాకులీనత కర్పణముగ
తనువుదోఁఱగిన స్నేహలతామతల్లి
రగులజేసి పోయిన పవిత్రంపు వహ్ని
ఋషుల యీ భూమి బునరుద్ధరించుగాత !

# స్నే హ ల తా దే వి

పూ రి ల్లు

నిత్యసంధ్యాకుమారీమణీమతల్లి
కట్టుచీర చెఱంగులు కాలుపోల్కి,
న స్తగిరిమ స్తకమున సన్న్య స్తకాంతి
సాంద్రుడగు సూర్యభగవాను చాయ లలమె.

ఆహితాగ్ని, సమ స్తవేదాంగవే త్త,
హారుడు సాయ మర్ఘ్యప్రదానాదరమున
నుద్ధరణి పంచపాత్రయు నూని ద్వార
వేదిపై గూరుచుండె నావేళయందు. ౧

హారునిగృహంబు ప్రాబడినయాకులయిల్లయినఁ దదీయమం
దిర సముపాంతవృక్షములు తీరిచినట్లు నిసర్గశోభలఁ
బెరుగుచు జూచువారి వలపించుచునుండు; విశుద్ధగోమయ
స్ఫురితసుగంధమై వెలుగుబో నలుమూలలు నింటిలోపలఁ.

రావిచెట్టొండు కొమ్మలు రాచుకొనుచు
నీడ లొఱయగ నుండు నా నికటమునకు
బూర్వభాగమునందు; నపూర్వశోక
హాతి విలాపించుచుండె విహంగ మొకటి. ౨

## స్నే హా ల తా దే వి

పచ్చికబయళ్ళ మేప ప్రభాతమందు
దోలిపెట్టిన నిండుబ్రొద్దుల మొదవును
గోపకుడు కట్టిపోయె, నెక్కుడుగ రోజు
ధేనుముఖమున జిక్కముల్ తీయకుండ. ౫

బ్రాహ్మణి యొకర్తు నవ్వు పల్వరుస మెఱయ
ఎందు బోయెదె యీ యఱసందె ననుచు
దఱుముకొని వచ్చె ద్వారబంధమ్ము వఱకు
బదియు నయిదేండ్లు నిండని బాల నపుడు. ౬

పూవులతోడ జేసినవిపోలె మనోహరమార్దవమ్ములై
యా విపులాయతాక్షి యొడలన్నియు సొంపులు నింపుచుండె లీ
లావిశద స్మితంబయి విలక్షణమైన కుమారికామణీ
శ్రీవదనంబు చూడుమని చెప్పక తప్పదు నాకు నెచ్చెలీ. ౭

నడల యొప్పుల వినయబంధములు గలవొ!
చూపుల విముగ్ధమయిన నాజూకు గలదొ!
నగు మొగమ్మున నందచందములు గలవొ!
లలితహృదయాన నేమి తలంపు గలదొ! ౮

తెలియలేనైతి జడమతికలన నేను,
నిత్యపరిచయవశత గణింపలేదు
కన్నజనయిత్రి, వెనువెంట నున్న చెలియ
ప్రియయు నెందులనో కనిపెట్టదయ్యె. ౯

ఏమిసేయుదు నలసందె నీ విషాద
మృదులగీతిక బాడు నో సదయహృదయ !
చూడు మనియెద భావ విశుద్ధవీథి
యందు స్నేహలతాదేవి యాననంబు. ౧౦

నడిచిన గందిపోవు చరణమ్ము లటంచు తపించుచుందు రా
బిడ తలిదండ్రు లెప్పుడును, విచ్చినపుష్పమువోలె బుట్టె వం
గడమున కెల్ల సౌరభముగా నయగారికుమారి, యెత్తి దిం
చెదు సతి యెవ్వతో పిలిచె స్నేహలతా! యని శైశవమ్మునన్.

పరిచయరహస్య మాధుర్య మెఱిగినట్టి
ప్రణయులకు స్నేహమతమట్లు, ప్రాప్తవశత
గలిసి మాటాడినట్టి ధన్యులకు నెల్ల
దలపు వెడలదు స్నేహలతాకుమారి. ౧౨

## స్నేహలతాదేవి

అట్లు తఱుముక వచ్చిన యనుగు తల్లి
చనవుబెంపున మఱలింప జాలదయ్యె,
చెలి ప్రియంవదతో గూడ నిలయ మెడలి
గంగ కేగుచున్న యా కన్నె నపుడు. ౧౩

పశ్చిమాభిముఖుండయి పరమనిష్ఠ
సంధ్యవార్చుచున్న హరేంద్రశర్మ గూడ,
ఎదియు బలుకక యఱగన్ను లెత్తి చూచు
చుండె స్నేహలతా ముఖమండలమును. ౧౪

గోనములపూత నా యనుగుకూతుమొగమ్మును జూచి దైవమా
యని తనుదాన నొచ్చుకొని యాకులముం బడె గాని బాల నె
మ్మనమున నెత్తురొల్కనిమాత్ర మెఱుంగకపోయె బ్రాహ్మణుం
డెనయు నిశాంతదీపకళయే స్ఫురియించు కుమారి వైఖరిన్.

స్నేహలతాప్రియంవదలు చిన్నతనమ్మునుండియున్ సుహృ
న్మోహనిబద్ధలై కలిసిపోయి రెడమ్ములు లేని కూరిమిన్
దేహములందు దక్క విడదీయదు వారల బ్రహ్మ యీడుజో
డై హృదయంగమంబగు ప్రియప్రణయమ్మున కేది పారమో.

## స్నేహలతాదేవి

అయిదేండ్ల భేద మున్నది
ప్రియంవదా స్నేహలతల విచ్చువయసునం,
దయినను స్ఫురియింపదు పరి
చయహీనుల; కెందు కీ విచారము మనకుఁ. ౧౭

ఆటపాటలయందు, బ్రియానులాప
ముల వలపునందు, నొండొరు బిలుచుకొనరు
పూర్ణనామమ్ములను నా సువర్ణగాత్రు;
లెంత మధురంబులో స్నేహవృత్తు లవుర. ౧౮

లత యని ముద్దుపేర సరళమ్ముగ బల్చు బ్రియంవదాసుహృ
ద్వ్రతి,పిలుచుం బ్రియా యనిముదమ్మున స్నేహలతాకుమారి,యే
వ్రతములు చేసి చెందిన సరాగమొ కాని వచింపజాల మా
జత చెలికారపుమ్మమత స్వాప్నికసాధ్యమయేమొ భూమిపై.

నిగనిగలువోవు చిన్ని బిందియ బుజాన
నడరుచుండ బ్రియంవద నడువదొడగె,
రేగిపోకుండ దువ్వి చేర్చిన మెఱుంగు
కురులజడచుట్ట యా బిందె నొఱసికొనగ. ౨౦

శిథిలకుంతలయై యుండె స్నేహలతయు;
నునుపుగాటుక కనుపట్టు లెనయ జెరిగి
యొక యనాదరణంపు పొందిక వెలార్చి
ముందుముందుగ నామెతో బోవునపుడు. ౨౧

వారి యింటికి నెంతయో దూరమందు
లేదు గంగాభవాని; చీలికలు వోయి
పాఱుచుండు గొండొకచూపుమేర కెలన;
నీటిదాకను నిసుకయే నిండియుండు. ౨౨

## గం గా తీ ర ము ; సం భా ష ణ

శ్రీభరతమాత కంఠాన సిరులు దొరయు
నాణిముత్యాల కల్యాణ హార మనగ
తేజరిల్లు నార్యావర్త దివ్యజీవ
నామలామృతవెల్లి గంగామతల్లి. ౧౩

హరజటారణ్యపుణ్యాకుల్యాంతరాళ
ముల నెసంగు దివ్యక్షీరములను సతము
స్నానమాడి కాబోలు ! దోషాకరుండు
కువలయానందు డయి నుతిగొనియె నక్క ! ౧౪

పవనచాలనమున నలల్ గవిసి కవిసి
తుంపురులు గుంపులెత్త, త్రోద్రోపులాడు
చిందు నవగాహనము లాడి యుందు రెలమి
వైదికయుగంపునాటి దివ్యర్షివరులు. ౧౫

కులపతులవాటికల సరస్సులకు మంచి
నీరు వోవు సరిత్కూలతీరములను
పట్టి మేసెడి హరిణశాబములు రెండు
మనవలెనె యిందు 'రాబోలు' నని స్ఫురించు. ౧౬

## స్నేహలతాదేవి

సుప్రశాంతములగు నుషస్సులను లేచి
చలి నెఱుగక మాఘస్నానములను సలిపి,
తపసికన్నెలు వల్కల ధారణముల
బనుపు మ్రుగ్గులు తీర్చి రీ భవ్యతటిని. ౨౭

ఋక్కులను బాడి రీ నదీప్రియతటమున,
యజ్ఞములు సల్పి రీ యేటి యంతికమున,
ఉపనిషత్సూక్తి సౌరభ మొదవె నిచట,
బూజ్యురా లౌట యరుదె యీ పుణ్యగంగ. ౨౮

తల్లి భాగీరథీదేవి చల్లనయిన
కడుపునఁ దాగి ధన్యయై కలిసిపోయె
పూతయమునాతరంగిణి; పూర్వజన్మ
సుకృత బీజము లిట్లు పండకయ యున్నె. ౨౯

కడిమి చెట్టుల దట్టమౌ గట్లకెలన,
మృదులసైకతశయ్యల, రేలుపవలు
నాడుకొన్న రాధాకృష్ణు లస్తమింప
నెట్టులోర్చెనో కాళింది హృదయ మకట! 30

ఆర్ ద్ర తులసీదళీమాల నందగిల్లు
కృష్ణకంఠము నిండు కౌగిటను పెనచి
వావివిడుపుల ద్రవియింప పచ్చియెడద,
సాంత్వనం బంద నోపు నిచ్చుటనె రాధ. 3౧

సరసతర వేణుచారణ చతురు డయిన
చిన్నిగోపాలు గాంక్షించి, స్నిగ్ధహృదయ
పరవశోన్మాదమున రాధ పాడి నట్టి
భక్తిగీతము లీమెగర్భమున గలవు. 3౨

ఈ తరంగిణి యొడ్డుల నిసుకమీద
సంజచాయ పూతలు వడ్డ సమయములను
ఆర బరచిన నీర్కావిచీర లనుచు
మోసపోయి యుండరె మునిముగ్ధ లక్క! 33

రేకుల్ రేకులుగా నుషస్సు జనయిత్రీప్రేమరాగమ్ము ప్రా
చీకళ్యాణకుటీరభాగముల బుష్పింపన్ ప్రబోధోత్సవ
శ్లోకమ్ముల్ రచియించుచున్ గడపబోలున్ నెచ్చెలీ! యిందు క
న్యాకాలీన పవిత్రజీవితము లార్యావర్త బాలామణుల్. 3౪

## స్నేహలతా దేవి

జ్వలితపద మగు నిగమానువాకములను,
తెలియ జాలని పరమ తాత్త్విక రహస్య
బోధ లెన్నొ సూత్రించిన పుణ్యకన్య
కా వికాస మే మయ్యె జగాన నేడు! ౩౫

ప్రకృతి మంగళక్షేత్ర మార్దవము దెలిపి,
పురుషుని విభూతిగుణయోగమును వెలార్చి,
పరమశుచి నొప్పు ప్రేమ ప్రపంచమునకు
నడుచు మార్గము మఱల నేర్పడునె సకియ! ౩౬

వాక్కు నర్థంబునకు బరస్పరమనోజ్ఞ
మయిన ప్రణయమున్ గుర్తించినట్టి ఋషుల
రసవదుపదిష్ట గీతానురక్తి సాగయు
వారిచట లోక మెల్ల స్వప్నముగ నెంత్రు. ౩౭

అనుచు భాషించుచుండె మోహానపు శ్రుతిని
స్నేహలత; లేచి పడుచున్న నీటియలలు
ఒండొరుల కంఠములు విడనోప కురికి
గంగపా లగు బాలల కరణి నుండ. ౩౮

నాడు లతాకుమారిక మృణాలలతా మృదులోక్తు లెల్ల గో
డాడదొడంగె నూరక ప్రియంవద, నేమియు దోప కామె రా
పాడెడు సందియంబున హతాహత యయ్యె బ్రవాహమందు న
ల్లాడుచు బోవుచున్న యురియాటల తామరపూవు పోలికన్.

స్నిగ్ధఋతు విలక్షణ మైన స్నేహలతకు
పెనగొనగ నొక్క ప్రియకంఠ మనుఘటిల్లె
వదలెడిని కాలవశత తద్బంధ మింక
నెచట బడి వాడిపోవునో యెఱుగరాదు. ౪౦

పాలమెఱుంగుచెక్కిళులపై కషణాంక నితంబ మండలీ
చేలముపై కలస్వనము జిల్కు మనోహరకంఠ మంజరీ
నాళముపై ప్రదోషతరుణంపురుచుల్ భ్రమియించు నాటి యా
బాలికవాలకమ్ము తలపన్ భయ మయ్యె బ్రియంవదాహృదిన్.

కీడు శంకించు భావరేఖిక నొకింత
సరళ మొనరించుకొనుచు, బ్రసన్నవదన
యై ప్రియంవద యిట్టుల ననియె నంత
ప్రక్రమవిభంగ మయిన ధోరణి ధ్వనింప. ౪౧

## స్నేహలతా దేవి

వెండికలశములట్లు బింబించు శిఖర
మస్తకము లెత్తి చూచు బ్రహ్మాండ మెల్ల
పర్వతవతంసు డీమె యబ్రంపు తండ్రి ;
యెంత కౌలీనమో యీ స్రవంతి మణికి ! ౪౫

హిమగిరి నితంబములు కన్నయిండ్లు గాగ
నడరు నీళ్ళాడు ప్రొద్దులు గడపవచ్చు
వనదసుత, లక్క చెల్లెండ్ల పసుపు బంత్రు
కడిమిచెట్ల పూబిండి నీ గాంగతటిని. ౪౬

ప్రకృతి సారళ్యపారుష్యభరిత మేని
గంగ నైర్మల్యకాలుష్యకలిత నిజము ;
సామగాన మాధుర్యవాసనయె కాదు
కలదు కౌరవ రక్త కశ్మలత యిందు. ౪౭

కారణాంతరముల నీ జగమ్ము నందు
రక్తి తెగిపోయినట్టి సుప్రాణికోటి
కథమశరణంబ యగు నీమహాప్రవాహ
గర్భ మెంతదారుణ కష్ట నిర్భరంబొ ! ౪౮

శశికిరణపుంజ పులకిత స్వరతరంగ
ములను గాంక్షించి చూతురు మోహసాధ
వీధికలనుండి యాల్మగల్ విసువులేక
ఈనదీతీర నాగరోద్యానవాటి. ౪౭

నావలను త్రోసికొంచు సుందరులతోడ
నిత్యసాయంవిహారముల్ నెఱపునట్టి
పడుచు లెఱుగ రీయమ ప్రభావము నొకింత
కలుషితాచార దోషవిష్వాలత లతరో ! ౪౮

పంకనిర్మగ్నకంఠ మగు పాడియావు
పగిది నున్నది ఋషు లున్న భరతభూమి;
కంటకంబులె పెరిగెడు ఖండవనుల,
బూలచె క్లైండిపోవు టబ్బురము కాదు. ౪౯

మొన్న పెండిలి చేసిన పుణ్యవల్లి
జనకుడు ఋణాతిరేక లజ్జాప్రపీడ
గడవజాలక గంగలో బడి శమించె;
భయము తలయెత్తదో యీ ప్రవాహతలిని ! ౫౦

## స్నేహలతా దేవి

ఊరినుండి యేతెంచుచు నొక్కనాడు
చెప్పికొనిరి మావారు విసివిన నుడుల ;
ఆప్రదోష రక్తాశల నరయు చప్పుడు
పిన్నితో వెన్కవచ్చుచు వింటి నేను. ౫౧

లోక మరికట్ట లేని వెల్లువల బొంగి
కలుషితము లైన భూముల గడగివైవ
నుచితధర్మము గా; కిట్టు లుగ్రసాధ
నముగ బరిణమించుట యెట్టిన్యాయ మగునో ! ౫౨

గొడ్డలి గండ్రవాయి నరకుల్ దిసి, కొమ్మలు పూలు లేక యీ
యొడ్డున నున్న వృక్షము లయో ! తలపించు పవిత్రధర్మముల్
చెడ్డ మహర్షి వంశగృహసీమల, జెల్లి ! తరింపలేదె పా
ల్పడ్డయధోగతిన్ భరతలక్ష్మి యొకానొకనాటికేనియున్. ౫౩

మంగళతరంగిణి, మహర్షిమాన్యభగిని,
హరిపదోదకగర్భ, పుణ్యస్రవంతి
యయి యరయుచుంట గాదె యీ యధమజగతి
పూర్ణధర్మసంపతనమ్ము బొంద దయ్యె. ౫౪



## స్నేహలతా దేవి

తాను వలచిన వరునకు దగినశుల్క
మాత్మజనకు లర్పింపలే కడలుచుండ,
మానికమువంటి శ్యామ జన్మంబు చెల్లి!
ఈమె పాల్సేసికొనె నెంత కృపణగతియొ! ౫౫

ప్రణయవిచ్ఛేదయాతనఁ బడిన పడుచు
నెవడో కాముకపశు వొక డేవమాడ,
విషమాలతాశనులను వేడి విఫల యగుచు
కడకు గంగాభవాని యంకమున దాగె. ౫౬

వలదని మోఱకించిన యపాత్రపువియ్యపువారి మాటలఁ
తల కడవంగలేక తిథితారల దోసమ్ముకై కలంగుచుఁ,
చెలియలి నొప్పగించి జననీమణి కన్నుల నీరు గార్చె నీ
స్థలముననే తలంపగ లతా! కటు వయ్యెడు నాటి లాంఛనల్.

నిత్యకళ్యాణతోరణ నిబిడ యగునో!
శాశ్వత శ్మశాన కరాళశాల యగునో!
తెలియగా రాదు జాహ్నవీదివ్యతత్త్వ;
మొకటనే మేలు కీడులు నొదిగి యుంట. ౫౮

## స్నే హా ల తా దే వి

నా వివాహంబులో వసంతంబు లాడి
మంగళస్నాన మాడి రీ గంగయందె ;
మన సఖీమణి మరణింప మందుశోక
మున నివాపోదకము లిచ్చి రనుజు లిందె. ౫౯

అనుచు నన్యోన్యభిన్నము లగుచు దోచు
భావముల ఖేదమోద బింబప్రదర్శ
నలు ప్రియంవద సూపె, వీనుల నొసంగి
యున్న స్నేహలతా దేవి వన్నె చెదర. ౬౦

మఱల నెన్నాళ్ళకో నదీమాత యయిన
ఈ యమరవేణి కేతెంతు మిరువుర మని,
యస్ఫుటంబుగ బలికె స్నేహలత యపుడు,
ప్రియయు వెనువెంటనే తలరించె నిట్లు. ౬౧

నీ పెండ్లి వసంతములకు
ద్రోపాడుచు బంధుజనులతో నిటు రామే ?
రేపో మాపో వినబడు
నా పున్నెపు బలుకు ఋణమె యబ్బిన మనకున్. ౬౨

అనుచు మాటలాడుకొనుచు నా యిర్వురు
పడతుకలును గాంగపథము వదలి
పోయి రిండ్లకెలన, బుడమి నల్లడలను
కాళరాత్రి కవిసి క్రమ్ముచుండ. ౬౩

# స్నేహలతా దేవి

## అగ్నిప్రవేశము

చీకటికప్పు విప్పిన నిశీథమునం గనరావు మేఘముల్
ఆకసమందు జీలి నడయాడుచునున్నను ; మండుచుండె తా
రాకలశాలిమాత్రమె, నిరాకులసృష్టియు సుప్తిమూర్ఛపా
లై కనజాల దెట్టి విపదాశయముౝ దన భూతసంతతిౝ. ౬౪

రెండవయామ మింకను తరింపగ లేదు, మహేంద్రమండువా
దండను చందమామవలె దళ్కులు జిల్కు మొగమ్ము నెత్తి బ్ర
హ్మాండము జూచుచుండె తనయామణియోర్తుక శ్రీయరుంధతీ
మండలికోసమో యన గ్రమక్రమభిన్నమనోవికారయై. ౬౫

కొంతసే పట్లు చూచి యే గుర్తు చెలికి
మనసు దగిలెనో గాని నిమ్మళము గాగ
పెరటి తలుపును నోరగా దెఱచికొనుచు
తులసికోటదగ్గఱ కేగి నిలచె నామె. ౬౬

అతికరాళం బయిన నిశాయామమందు
నిర్మలస్థిర సంకల్ప నిష్ఠ నటకు
నేగుదెంచిన యామహాభాగ యకట !
స్నేహలత యంచు నేటికి చెప్పవలయు? ౬౭

తారా సహస్ర దీపిత
ధారాధరపథము నరసి తన్మయమై తా
నీ రీతిని తలపోసెను
చీర చెఱంగంసమందు జెదరుచు నుండన్. ౧౮

బాహ్యసృష్టికి నిద్రాప్రపంచ మొకటి
లేకయుండిన శాంతియే లేక యుండు
లోకమందున, సుఖదుఃఖ లోలగతుల
సంకరము గాని యానందజగతి యేదో ! ౧౯

కంఠములు పట్టి నఱకెడి ఘాతుకులును,
చిర దురంత వ్యథావహ్ని మఱుగు నరులు
నొక్కపగిది సమమ్ముగా నొడలు మఱచి
నెద ననుభవించు విశ్రాంతి నిదుర యొకఁడె. ౨౦

తగిన వరుండు రాఁడను వెతల్ కడుపెల్ల దహించివైవ నె
వ్వగల గృశించు తల్లియు, వివాహనిబంధన మైన శుల్క మీ
యగనగునంత ద్రవ్యమునకై పడరాని నికృష్టయాతనన్
బొగిలెడు తండ్రియున్ జననిఁ! పొందిరి యించుక శాంతి నియ్యెడన్

నిదుర బోవుచు నున్నారు నిసువు లెల్ల ;
తెల్లవాఱిన గృహలక్ష్మి తెల్లవాఱు ;
ఇంత దుర్గతి నైచ్య మే నేల తెచ్చి
పెట్టవలయు బావన మైన పితృగృహాన ? ౭౨

మాన్యు లయిన మామకపితామహులు పూజ్యు
లెపుడొ నిలిపిన యీ పవిత్రపు కుటీర,
మన్యజనపాదధూళి మాలిన్య మంది
యహిత భాషోపఘోష దైన్యమున బడునె! ౭౩

నాకతంబున ముద్దుకూనలును, నమ్మ,
తండ్రి ! నీవును దీర్ఘనిదాఘతాప
బహుళ దారిద్ర్యవారాశి బడెదు వారె ?
వలదు వల దట్టి కులమహోపద్రవమ్ము ! ౭౪

భరతజనయిత్రి సుకృత తపఃఫలమ్ము
లన నుదయ మైన యువజను లక్కటకట !
అధమ పురుషార్థ మనక కన్యల వరింప
శుల్కముల కువ్విళుల నూఱు శూరు లయిరె ! ౭౫

వేదములు పుట్టిన పవిత్ర వీధియందు
శుద్ధకన్యాకులీనత శుల్కమునకు
బా లగు నవస్థ యిసిరో! సంప్రాప్తమయ్యె!
తీర్పలేనె నా ప్రాణసమర్పణమున? ౭౬

తావకీన మనఃపీడ పోవుగాక!
మామకీన కన్యాదర్శ మహిత పదవి
నీచశుల్కము పాల్గాక నెగడుగాక!
అస్వదాత్మ సమర్పణోపాస్తి దండ్రి! ౭౭

పశుసహజ మైన పురుషప్రభావ మిట్లు
పావన స్త్రీ కళాభాగపదవి నింత
నిరసనోన్మాద దృష్టి గణింప కున్నె?
ఋషిమహాదర్శముల నన్వయింత్రె యిట్లు? ౭౮

కన్నియను బెండ్లియాడునో? కన్నతండ్రి
యర్పణము జేయు శుల్క దివ్యాప్సరసను
పెండ్లియాడునో యకట! యీపెండ్లికొడుకు;
అడుగరే యొక్కరయిన నీ యార్యసుతుల! ౭౯

## స్నేహలతా దేవి

సుంక మీయక మంగళసూత్రమునకు
యోగ్యురాలు కాదేని నిర్భాగ్య యయిన
కన్య, యాజీవితము నేల కాల్పరాదు ?
చెడు నుదాసీనతకు బాలు సేతకన్న. ౮౦

అనుచు దలపోయుచుండ, నా యనుగుకన్నె
శిరసుమీదుగ 'హా' యని యఱచు చొక్క-
పక్షి వినువీధి నేగె ; నా బాలికయును
అనుమతించితె తల్లీ య టంచు గదలి- ౮౧

ఇల్లు సొచ్చి ద్వారము మెలమెల్ల మూసి
వ్రాసి దాచిన యొకయుత్తరమును తీసి
వేదికోపరితలమున బెట్టె కన్నె,
సంతరించె గాబోలు నాసరికె యదియు. ౮౨

తాను ధరియించి యున్న యుత్తమ దుకూల
మవల బడవైచి పూనె గన్యామతల్లి
తైలవస్త్రం బొకటి మడతలు విదిల్చి,
నారచీర దాల్చిన జానకి విధాన. ౮౩

## స్నే హ ల తా దే వి

అకట ! యే మని పలుక నో రాడు నింక !
భగవతీధ్యానమున భగభగ వెలుంగు
నగ్నిలోన బూర్ణాహుతి యయ్యె నయ్యో!
ధన్యగుణవల్లి స్నేహలతామతల్లి. ౧౪

నవ్వు మోముల నిండుమనసుల తోడ
నొండొరుల కౌగిలింతల నోలలాడు
తండ్రిబిడ్డల పగిదిని తనిసి రపుడు
ఒదిగి స్నేహలతావీతిహోత్రు లవుర ౧౫

విరియు చెంగల్వపూవుల చెరువునందు
గులుకు రాయంచకన్నియ యశోదమ పగిది
చూడ దలపించె భావవిశుద్ధవీధి
దహనులో నున్న స్నేహలతామతల్లి ! ౧౬

తామ్రపర్ణీనవారుణోదకములోన
బొదలు తెలియాణిముత్యాల బొమ్మ బోలి,
చూడ దలపించె భావవిశుద్ధవీధి
దహనులో నున్న స్నేహలతామతల్లి ! ౧౭

# స్నేహలతాదేవి

మామిడిచిగుళ్ళ నిగనిగల్ మలయు సెజ్జ
జెదరు ధవళోత్తరీయంపు జెఱగు వరుస,
జూడ దలపించె భావవిశుద్ధవీథి
దహనులో నున్న స్నేహలతామతల్లి! ౧౮

పండు పగడాలరాశిలో బడి భ్రమించు
నిండు జాబిల్లి రేక నా నిర్మలముగ,
జూడ దలపించె భావవిశుద్ధవీథి
దహనులో నున్న స్నేహలతామతల్లి! ౧౯

లిఖిత కుంకుమరంగవల్లికల నడుమ
తీర్చినట్టి కర్పూరలతిక విధాన,
జూడ దలపించె భావవిశుద్ధవీథి
దహనులో నున్న స్నేహలతామతల్లి! ౨౦

ప్రజ్వలించు జీవౌషధీవనమునందు
రంజిలెడి తెల్లని సుధాసరస్సు చాయ,
జూడ దలపించె భావవిశుద్ధవీథి
దహనులో నున్న స్నేహలతామతల్లి! ౨౧

## స్నేహలతాదేవి

సుభగ తాంబూల రససాంద్ర సుషమమధ్య
నొత్తు తెలినవ్వు రేకల గుత్తిమాద్రి,
జూడ దలపించె భావవిశుద్ధవీథి
దహనులో నున్న స్నేహలతామతల్లి! ౯౨

కనక కదళీదళంబుల గప్పబడిన
పారిజాత ప్రసవ దివ్య హార మనగ,
జూడ దలపించె భావవిశుద్ధవీథి
దహనులో నున్న స్నేహలతామతల్లి! ౯౩



# స్నే హ ల తా దే వి

## స్నే హ ల తా దే వి లే ఖ

తనుకళావల్లి భస్మసాత్కార మంద
నాఁమె పరమాణు పరిమాణ మయిన యాత్మ,
విమల నక్షత్ర లోకమార్గమును బట్టె;
దీప మాఱి తేజస్సులో తేలునట్లు. ౯౪

స్నిగ్ధకాంచనలత వంటి స్నేహలతను
కడుపునం గాంచ నోచిన పుడమివేల్పు
గోలు గోలున నేడ్చె నా కూఁతు జూచి,
బ్రాహ్మణి నిరస్తచైతన్యభాతి గూలె. ౯౫

ద్వాదశార్కమండలములు దాటి వాయు
రాసు లెక్కు చైతన్య తరంగ మట్లు,
ఆకసము జీల్చికొని లీన మయిన స్నేహ
లతను చూడ లేరైరి మూర్ఛితుల రగుట. ౯౬

ప్రాణములు లేని కట్టెల పగిది నున్న
యా విషాద దంపతుల నత్యాదరమున
జండ శోకోపశమ నోపచారములను
ఎట్టు లెటులో వేగించిరి హితులు నాఁడు. ౯౭

## స్నే హా ల తా దే వి

స్నేహలతామనంబు నెడసేసి యెఱుంగని యా ప్రియంవదా
స్నేహవతీమతల్లి విడిచెన్ నయనమ్ముల నుష్ణబాష్ప సం
దోహము, వేదిపై నప్పుడు దోచె నొకానొక లేఖ పావన
స్నేహలతాస్వహస్తకమనీయ కళాక్షరపూర్ణహారమై. ౯౮

కన్నుల నీరు నిండుకొన గంఠము గద్గదమై వణంక నా
స్విన్నముఖంబుతోడ వినిపించె ప్రియంవద యిట్లు; మిన్నలున్
మన్నను, మీరు మేమును, సమస్తచరాచరభూతసృష్టియున్
కన్నియలోన లీన మయి గానము జేయగ నామొనామమున్.

# స్నేహలతా దేవి

లేఖ

పూజ్యుఁడ వగు తండ్రీ!

నాదు పెండిలి కొఱకుఁ యనాదిగృహము
నాధి పెట్టుట విన నోప నయ్యా నేను!
చేయగారాదు నీ విట్లు, చేయదగిన
విధివిధానంబు గూడ భ్రాంతింప బోదు. ౧౦౦

ఎల్లి చిఱుప్రొద్దుచాయ రే కెత్తకుండ
నిశ్చలానంద బాంధవ నిలయమునకు
నడచి పోవంగ గలదు నీ కడుపునందు
దుర్ముహూర్తాన బుట్టిన దుహితయాత్మ. ౧౦౧

లలితలతవలె నీయుర స్థలము నెనసి
ముఱియు నను బెంచి తల్లారు ముద్దుగాగ,
కలలగూడ నా సౌఖ్యమే కలవరించి
కొల్లవెట్టితి నీ ప్రేమ గూర్చితండ్రి! ౧౦౨

నగుచు బెరిగితి నీ పదునయిదు నేండ్లు;
రాజరాజ కుమారికా రత్నములును
ననుభవింపరు నేను పొందిన సుఖమ్ము:
కన్నవారికి గారాబు కంఠమాల.

మొన్న నపరాహ్ణమున జాలప్రొద్దు నీవు
కాళ్లు వాయంగ గట్టిన కడపలెల్ల
తిరిగి తిరిగి వేసారి యేతెంచినట్టి
దైన్యపు మొగమ్ము విడదు నా తలపు తండ్రి ! ౧౦౪

కడుపునను గన్న దుర్మోహ మడప లేక
యాసలేమి గత్యంతర మాచరింతె !
యంతయును బోయె నను శోకహాతకటూక్తి
నాచెవుల మాఱుమ్రోయుచున్నదియ యింక. ౧౦౫

నీవు సైచిన బహు కష్టనిష్ఠురముల,
నావలి ఋణకథావిధ మాలకించి
తిని మనశ్ఛేదవృత్తి నోజనకమాళి !
యింత తెచ్చునె నీ దురదృష్టపుత్రి ! ౧౦౬

నన్నుగన్న దోషమునకు, నన్ను నీవు
జ్ఞానవతిని చేసిన పాపకర్మమునకు,
ననుభవింతె ప్రాయశ్చిత్త మనుచు దండ్రి !
పైతృక స్వాపహరణ నిర్భాగ్య బాధ. ౧౦౭

## స్నే హ ల తా దే వి

కన్యకు వివాహ మేలాటి కామితంబొ
జనకునియెడంద భారము సడలదేని ?
ఆర్యకులధర్మసంప్రదాయముల నింత
తెలియలేరె ! యధోగతి గలగి నలగి. ౧౦౮

ఎంత సాంఘికనింద వహించి తీవు
పరిణయము గాని నాదు పాపమ్ముకతన;
గుణ కులీనుం డయిన భర్తకొఱకు తండ్రి !
సలిపి తెన్నియత్నములు నిష్ఫలసమాప్తి. ౧౦౯

తల్లిబిడ్డలు విడిపోయి తల్లడిల్ల
లోకమును ముంచినట్టి వెల్లువలలోన
నార్తిహాతులైనవారి సాహాయ్యమునకు
బాటుపడిన నాసోదరుల్ వన్నెగాంత్రు ! ౧౧౦

మాతృదేశాభిమాన ప్రమాణబుద్ధి
జేకొని విదేశవస్తువుల్ తాక మనుచు
భరతపుత్రకు లెంద ఱెందఱో వ్రతంబు
లూనినా రంచు వింటి నత్యుత్సుకతను. ౧౧౧

ఎందు గనిన స్వార్థత్యాగమే జ్వలించు:
నీ యుదయకాలమందును హేయ మయిన
కన్యకావరశుల్క రాక్షసకళంక
మును నిసీ యని రోయడే యనుజు డొకడు. ౧౧౨

కడచిన నిశీథమున నొక్క కలను గాంచి
యందు బూనితి నీ వ్రత మాప్తజనక !
మధుర మధురమ్ముగా శ్రవోమార్గమందు
బరిమళించె నొకానొక భవ్యగీతి. ౧౧౩

కన్య మైత్రేయి స్వరపూతకంఠ మనుచు,
నారదుని మహతీ దివ్యనాద మనుచు,
భారతీ పాణి వీణారవం బటంచు,
నాలకించితి తండ్రి ! నే నా సుగీతి. ౧౧౪

మురళి పాటలవలె గొంత ముద్దు గొలిపె,
భ్రమరగీతల గతి గొంత భ్రమ ఘటించె,
సుకవి జయదేవ సరళగీతికల పగిది
గొంత రుచి గొల్పె నా గాన మంతరమున. ౧౧౫

## స్నే హ ల తా దే వి

పుడమిని కడలిని మును నె
న్నడు జూడని యొక్క- కాంతి నవ నవమై పెం
పడరగ దర్శించితి నా
నడుమను వెలుగొందు శ్రీ కనకదుర్గాంబన్. ౧౧౬

మృదువాత్సల్య దర స్మిత
వదనమ్మున నన్ను బిలిచె, బరమానందా
స్పద మయిన శ్రీభవానీ
సదనమునకు 'రమ్ము రమ్ము సత్వర' మనుచున్. ౧౧౭

అపుడు తలచితి తండ్రి ! పూజ్యాత్మ నిన్ను,
సంతత విషాద మయిన మా జనని మోము,
నిల్లు పండువు జేయు నాచెల్లి తమ్ము
లను, చిరప్రేమవశ మైన మనసునందు. ౧౧౮

హృదయమును నంతకంత కైహికసమ స్త
వస్తువాంఛాపరాఙ్ముఖ వ్య వెలుగ,
బితృనిలయ ముద్ధరించి, మీ వెతలు తీర్ప
అంబ వెనువెంట వచ్చెద నంటి తండ్రి! ౧౧౯

నేను పోయినపిదప నా నిండుబూది
దడుపుదురు మీరు బాష్పదుద్గములచేత;
తండ్రి! యైనను పిత్రార్జితంబు నిలచు,
నలరు నస్మదస్ఖలిత కన్యాత్వ మవని. ౧౨౦

అది మొదల్ చింత జేసితి నస్మదీయ
లోక యాత్రాభరంబు వీడుటకు దండ్రి !
యగ్ని జల విషముల సాధనాంతరంబు
నెన్నుకొన గోరి స్వార్థనిస్పృహాసమాధి. ౧౨౧

యాగములలో హవిస్సుల నాదరించు
పూత తేజస్వి, ఋషిగేయు, వీతిహోత్రు,
నెదను వినయాంజలి ఘటించి తుదకు తండ్రి !
ప్రార్థనలు సల్పితిని యంబపజ్జ నిలుప. ౧౨౨

నాయనుంగు తండ్రి! పోయెద ! పోయెద !
స్వీకరింపుమయ్య చిత్తశుద్ధి
గన్నబిడ్డ యిచ్చు కడసారి యీ వంద
నంబు నీశ్వరార్పణం బ టంచు ! ౧౨౩

## స్నే హ ల తా దే వి

మాతృ శీతల గర్భంబు మాడ్కి నిపుడు
ప్రకృతి నిదురించుచున్నది పరమశాంతి;
మఱల మేలుకువ రాని యా మహితసుప్తి
నేనుగూడ మహానందలీన నగుదు. ౧౨౪

నాదు సోదరీ సోదరు లాదరమున
నిచ్చు ప్రియబాష్ప మాలల నిష్టరక్తి
దీసికొని రండు వీక్షింతు నాసహోద
నమ్మయును నీవు వచ్చెదు నంతదాక ! ౧౨౫

అధమ శుల్క కలంకము నంటకుండ
నా పవిత్ర దీక్షాకన్యకా పథంబు
రక్షణము చేసినట్టి యీ దక్షిణాగ్ని
కలుషితాచారముల గాల్చి వెలుగుగాక ! ౧౨౬

▽

